# అథ ఏకాదశో%ధ్యాయః

## దేవస్తుతి

వ్యాస ఉవాచ |

బ్రహ్మపుత్ర మహాప్రాజ్ఞ ధన్యస్త్వం శైవసత్తమ | కిమకార్షు స్తతో దేవి దగ్ధే చ త్రిపురే%ఖిలాః || 1

మయః కుత్ర గతో దగ్ధో పతయః కుత్ర తే గతాః | త్సర్వం మే సమాచక్ష్వ యది శంభుకథాశ్రయమ్ || 2

వ్యాసుడిట్లు పలికెను-

హే బ్రహ్మపుత్రా! శివ భక్తాగ్ర గణ్యుడవగు నీవు మహాప్రాజ్ఞుడవు, ధన్యుడవు. త్రిపురమునందలి అందరు దహింపబడిన తరువాత దేవతలు ఏమి చేసిరి? (1) మముడు ఎచటకు వెళ్లెను? ఆ త్రిపురాధిపతులు ఎట్టి గతిని పొందినారు? శంభుని గాథ ఆశ్రయముగా గల ఆ వృత్తాంతమునంతనూ నాకు చెప్పుము (2).

సూత ఉవాచ |

ఇత్యాకర్ణ్య వ్యాసవాక్యం భగవాన్ భవకృత్సుతః | సనత్కుమారః ప్రోవాచ శివపాదయుగం స్మరన్ || 3

సూతుడిట్లు పలికెను -

బ్రహ్మ పుత్రుడగు సనత్కుమార భగవానుడు వ్యాసుని ఈ మాటను విని , శివుని పాదయుగళమును స్మరించి ఇట్లు బదులిడెను (3).

సనత్కుమార ఉవాచ|

శృణు వ్యాస మహాబుద్ధే పారాశర్య మహేశితుః | చరితం సర్వపాపఘ్నం లోకలీలాను సారిణః || 4

మహేశ్వరేణ సర్వస్మింస్త్రిపురే దైత్యసంకులే | తద్గ్ధే విశేషతస్తత్ర విస్మితాస్తే%భవన్ సురాః || 5

న కించిదబ్రువన్ దేవాః సేంద్రోపేంద్రాదయస్తదా |
మహాతేజస్వినం రుద్రం సర్వే వీక్ష్య ససంభ్రమాః || 6

మహాభయంకరం రౌద్రం ప్రజ్వలంతం దిశో దశ | కోటి
సూర్యప్రతీకాశం ప్రలయానిలసన్నిభమ్ || 7

భయాద్దేవం నిరీక్ష్యైవ దేవీం చ హిమవత్సుతామ్ | బిభ్యిరే నిఖిలా
దేవప్రముఖాస్తస్థురానతాః || 8

దృష్ట్వానీకం తదా భీతం దేవానామృషిపుంగవాః | న కించి
దూచుస్సంతస్థుః ప్రణ   ముస్తే సమంతతః || 9

అథ బ్రహ్మాపి సంభీతో దృష్ట్వా రూపం చ శాంకరమ్ | తుష్టావ
తుష్టహృదయో దేవై స్సహ సమాహితః || 10

సనత్కుమారుడిట్లు పలికెను -

ఓ వ్యాసా! మహాబుద్ధీ! పరాశరా పుత్రా! లోకలీలలను అనుసరించే మహేశ్వరుని చరితమును వినుము. ఈ చరితము సర్వపాపములను నిర్మూలించును (4). రాక్షసులతో నిండియున్న త్రిపురములు సంపూర్ణముగా మహేశ్వరునిచే దహింపబడగా, అచట ఆ దేవతలు పరమాశ్చర్య భరితులైరి (5). ఇంద్రుడు, విష్ణువు మొదలగు దేవతలందరు అపుడు మహాతేజశ్శాలియగు రుద్రుని గాంచి తొట్రుపాటును చెందినవారై ఏమియూ పలుకకుండగా మిన్నకుండిరి (6). మహాభయంకరమగు ఉగ్రరూపము గలవాడు. పది దిక్కులను తన తేజస్సుచే మండునట్లు చేయువాడు, కోటి సూర్యుల తేజస్సు గలవాడు, ప్రళయ కాలాగ్నిని బోలియున్నవాడు (7). అగు శివుని, మరియు హిమవత్పుత్రియగు ఉమాదేవిని గాంచిన దేవోత్తములు అందరు భయపడి తలలు వంచి నిలబడి యుండిరి (8). ఇట్లు భయపడియున్న దేవసై#ౖన్యమును గాంచిన మహర్షులు నిశ్శబ్దముగా అన్ని దిక్కులయందు నమస్కరించి మిన్నకుండిరి (9). అపుడు సంతుష్టి చెందిన హృదయము గల బ్రహ్మ శంకరుని ఆ రూపమును గాంచి మిక్కిలి భీతిల్లి దేవతలతో కూడిన వాడై సమాహిత చిత్తముతో స్తుతించెను (10).

విష్ణునా చ స భీతేన దేవ దేవం భవం హరమ్ | త్రిపురారిం సగిరిజం భక్తాధీనం మహేశ్వరమ్ || 11

బ్రహ్మ భయపడివున్న విష్ణువుతో గూడి, దేవదేవుడు, పాపహారి, త్రిపురాంతకుడు, పార్వతీపతి, భక్తులకు వశమగు వాడు అగు మహేశ్వరుని స్తుతించెను (11).

బ్రహ్మోవాచ |

దేవ దేవ మహాదేవ భక్తనుగ్రహకారక | ప్రసీద పరమేశనా సర్వ దేవహితప్రద || 12

ప్రసీద జగతాం నాథ ప్రసీదానంద దాయక | ప్రసీద శంకరాస్వామిన్ ప్రసీద పరమేశ్వర || 13

ఓంకారాయ నమస్తుభ్య మాకారపరతారక | ప్రసీద సర్వదేవేశ త్రిపురఘ్న మహేశ్వర || 14

నానావాచ్యాయ దేవాయ వరణప్రియ శంకర | అగుణాయ నమస్తుభ్యం ప్రకృతేః పురుషాత్పర || 15

నిర్వికారాయ నిత్యాయ నిత్యతృప్తాయ భాస్వతే | నిరంజనాయ దివ్యాయ త్రిగుణాయ నమో%స్తు తే || 16

సగుణాయ నమస్తుభ్యం స్వర్గేశాయ నమో%స్తు తే | సదాశివాయ శాంతాయ మహేశాయ పినాకినే || 17

సర్వజ్ఞాయ శరణ్యాయ సద్యోజాతాయ తే నమః | వామదేవాయ రుద్రాయ తథా తత్ పురుషాయ చ || 18

అఘోరాయ సుసేవ్యాయ భక్తాధీనాయ తేనమః | ఈశానాయ వరేణ్యాయ భక్తానంద ప్రదాయినే || 19

బ్రహ్మ ఇట్లు పలికెను -

దేవ దేవా! మహా దేవా! బనక్తులననుగ్రహించు వాడా! దేవతలందరికీ హితమును కలుగజేయువాడా! పరమేశ్వరా! ప్రసన్నుడవు కమ్ము. (12). ఓ జగన్నాథా! ప్రసన్నుడవు కమ్ము.ఆనందమునిచ్చువాడా! అనుగ్రహించుము. శంకరస్వామీ! ప్రసన్నుడవు కమ్ము. పరమేశ్వరా! దయను చూపుము (13). ఓం కారస్వరూపుడవగు నీకు నమస్కారము. నీ రూపమును ధ్యానించు వారిని నీవు రక్షించెదవు. సర్వదేవ ప్రభూ! త్రిపుర సంహారా! మహేశ్వరా! ప్రసన్నుడవగుము (14). నామములన్నింటిచే నిర్దేశింపబడువాడు, భక్త ప్రియుడు, నిర్గుణుడు, ప్రకృతి పురుషుల కంటె అతీతుడు అగు నీకు, ఓ శంకర దేవా| నమస్కరాము (15). వికారములు లేనివాడు, శాశ్వతుడు, సర్వదా తృప్తిని చెందియుండు వాడు, ప్రకాశస్వరూపుడు, కర్మ లేపము లేనివాడు, త్రిగుణాత్మకుడు అగునీకు నమస్కరము (16). సగుణుడవగు నీకు నమస్కారము. స్వర్గమునకు ప్రభువు, సదాశివుడు, శాంతుడు, మహేశ్వరుడు, పినాకధారి యగు నీకు నమస్కారము (17). సర్వజ్ఞుడు, శరణ్యుడు, సద్యోజాతుడు, వామదేవుడు, తత్పురుషుడు, రుద్రుడు అగు నీకు నమస్కారము (18). శాంతస్వరూపుడు, చక్కగా సేవింప తగినవాడు, భక్తులకు వశములో నుండువాడు, సర్వేశ్వరుడు, సర్వశ్రేష్ఠుడు, భక్తులకు ఆనందము నిచ్చువాడు అగు శివునకు నమస్కారము (19).

రక్ష రక్ష మహాదేవ భీతాన్నస్సకలా మరాన్ | దగ్ధ్వా చ త్రిపురం సర్వే కృతార్థా అమరాః కృతాః || 20

స్తుత్వైవం దేవతాస్సర్వా నమస్కారం పృథక్ పృథక్ | చక్రుస్తే పరమప్రీతా బ్రహ్మాద్యాస్తు సదాశివమ్ || 21

అథ బ్రహ్మా స్వయం దేవం త్రిపురారిం మహేశ్వరమ్ | తుష్టావ ప్రణతో భూత్వా నతస్కంధః కృతాంజలిః || 22

ఓ మహా దేవా! భయపడి యున్న మా దేవతల నందరినీ రక్షింపుము. రక్షింపుము. నీవు త్రిపురములను దహించుటచే మా దేవతలందరు కృతార్థులైనారు (20). బ్రహ్మ మొదలగు దేవతలందరు ఇట్లు స్తుతించి, పరమప్రీతులై సదా శివునకు

ఒక్కొక్కరుగా నమస్కరించిరి (21). అపుడు బ్రహ్మ చేతులు ఒగ్గి సాష్టాంగప్రణామమాచరించి త్రిపురాంతకుడగు మహేశ్వర దేవుని స్వయముగా నిట్లు స్తుతించెను (22).

బ్రహ్మోవాచ |

భగవన్ దేవ దేవేశ త్రిపురాంతక శంకర | త్వయి భక్తిః పరామే%స్తు మహాదేవానపాయినీ || 23

సర్వదా మే%స్తు సారథ్యం తవ దేవేశ శంకర | అనుకూలో భవ విభో సదా త్వం పరమేశ్వర || 24

బ్రహ్మ ఇట్లు పలికెను -

హే భగవన్! దేవ దేవా! ఈశ్వరా! త్రిపుర సంహారీ! శంకరా! మహా దేవా! నాకు నీ యందు ఎన్నటికీ తొలిగిపోని పరాభక్తి కలుగు గాక! (23). ఓ దేవదేవా! శంకరా! నీవు అన్ని వేళలా సారథివై నన్ను నడిపించుము. హే విభో! పరమేశ్వరా! నీవు నాకు సర్వదా అనుకూలుడవు కమ్ము (24).

సనత్కుమార ఉవాచ |

ఇతి స్తుత్వా విధిశ్శంభుం భక్తవత్సలమానతః | విరరామ నతస్కంధః కృతాంజలి రుదారధీః || 25

జనార్దనో%పి భగవాన్ నమస్కృత్య మహేశ్వరమ్ | కృతాంజలి పుటో భూత్వా తుష్టావ చ మహేశ్వరమ్ || 26

సనత్కుమారుడిట్లు పలికెను -

విశాలహృదయుడగు బ్రహ్మ చేతులను జోడించి సాష్టాంగప్రణామాచరించి భక్తవత్సలుడగు శంభుని ఈ విధంబున స్తుతించి విరమించెను (25). విష్ణుభగవానుడు కూడా చేతులు జోడించి మహేశ్వరునకు నమస్కరించి ఇట్లు స్తుతించెను (26).

విష్ణురువాచ |

దేవాధీశ మహేశాన దీనబంధో కృపాకర | ప్రసీద పరమేశాన కృపాం కురు నతప్రియ || 27

నిర్గుణాయ నమస్తుభ్యం పునశ్చ సగుణాయ చ | పునః ప్రకృతిరూపాయ పునశ్చ పురుషాయ చ || 28

పశ్చాద్గుణ స్వరూపాయ నతో విశ్వాత్మ నే నమః | భక్తిప్రియాయ శాంతాయ శివాయ పరమాత్మనే || 29

సదాశివాయ రుద్రాయ జగతాం పతయే నమః | త్వయి భక్తిర్దృఢా మే %ద్య వర్ధమానా భవత్వితి || 30

విష్ణువు ఇట్లు పలికెను -

ఓ దేవాధి దేవా! మహేశ్వరా! దీనబంధూ! కృపానిధీ! ప్రసన్నుడవగుము. ఓ పరమేశ్వరా! నమస్కరించు వారిపై ప్రేమ గల నీవు దయను చూపుము (27). నిర్గుణుడవు, సగుణుడవు కూడ నీవే. పురుషుడవు ప్రకృతివి కూడ నీవే. అట్టి నీకు నమస్కారము (28). సృష్టి అయిన తరువాత త్రిగుణాత్మకుడైన విశ్వస్వరూపుడు, భక్తి ప్రియమైనవాడు, శాంతుడు, శివుడు, పరమాత్మ అగు నీకు నమస్కారము (29). సదాశివుడు, రుద్రుడు, జగత్తులకు ప్రభువు అగు నీకు నమస్కారము. నీ యందు నాకు దృఢమగు భక్తి ఈనాడు వర్ధిల్లును గాక! (30).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్త్వా విరరామాసౌ శైవప్రవరసత్తమః | సర్వేదేవాః ప్రణమ్యోచుస్తతస్తం పరమేశ్వరమ్ ||

సనత్కుమారుడిట్లు పలికెను -

శివభక్తులలో అగ్రగణ్యుడగు విష్ణువు ఇట్లు పలికి విరమించెను. అపుడు దేవతలందరు ఆ పరమేశ్వరునకు ప్రణమిల్లి ఇట్లు పలికిరి (31).

దేవా ఊచుః |

దేవనాథ మహాదేవ కరుణాకర శంకర | ప్రసీద జగతాం నాథ ప్రసీద పరమేశ్వర || 32

ప్రసీద సర్వకర్తా త్వం నమామస్త్వాం వయం ముదా | త్వయి భక్తిర్ధృఢాస్మాకం నిత్యం స్యాదనపాయినీ || 33

దేవతలిట్లు పలికిరి -

దేవదేవా! మహాదేవా! కరుణానిధీ| శంకరా! జగన్నాథా! ప్రసన్నుడవగుము. పరమేశ్వరా! ప్రసన్నుడవు కమ్ము (32). సర్వమును చేయువాడవు నీవే. నిన్ను మేయు ఆనందముతో నమస్కరించు చున్నాము. మాకు నీ యందు ఎన్నటికీ తొలగిపోని నిత్యమగు భక్తి దృఢముగా కలుగును గాక! (33)

సనత్కుమార ఉవాచ |

ఇతి స్తుతశ్చ దేవేశో బ్రహ్మణా హరిణామరైః | ప్రత్యువాచ ప్రసన్నాత్మా శంకరో లోకశంకరః || 34

సనత్కుమారుడిట్లు పలికెను -

బ్రహ్మ విష్ణువులు, మరియు దేవతలు ఇట్లు స్తుతించగా, లోకములకు మంగళములను కలుగజేయు శంకరుడు ప్రసన్నమగు అంతఃకరణము గలవాడై ఇట్లు బదులిడెను (34).

శంకార ఉవాచ |

హే విధే హే హరే దేవాః ప్రసన్నో%స్మి విశేషతః | మనో%భిలషితం బ్రూత వరం సర్వే విచారితః || 35

శంకరుడిట్లు పలికెను -

ఓ బ్రహ్మ! హరీ! ధేవతలారా! నేను మిక్కిలి ప్రసన్నుడనైతిని. మీరందరు విచారము చేసి మీ మనస్సులలోని అభీష్టమును చెప్పుడు. వరము నిచ్చెదను (35).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్తం వచనం శ్రుత్వా హరేణ మునసత్తమ |
ప్రత్యూచుస్సర్వదేవాశ్చ ప్రసన్నేనాంతరాత్మనా || 36

సనత్కుమారుడిట్లు పలికెను -

ఓ మహర్షీ! హరుడు ప్రసన్నమగు మనస్సుతో పలికిన ఈ మాటను విని దేవతలందరు ఇట్లు బదులిడిరి (36).

సర్వే దేవా ఊచుః |

యది ప్రసన్నో భగవన్ యది దేయో వరస్త్వయా | దేవదేవేశ చాస్మభ్యం జ్ఞాత్వా దాసన్ హి నస్సురాన్ || 37

యదా దుఃఖం తు దేవానాం సంభ##వేద్దేవసత్తమ | తదా త్వం ప్రకటో భూత్వా దుఃఖం నాశయ సర్వదా || 38

దేవతలందరు ఇట్లు పలికిరి -

హే భగవాన్! నీవు ప్రసన్నుడవై వరమునీయ దలంచినచో, దేవతలమగు మమ్ములను నీ దాసులుగా స్వీకరించుము. ఓ దేవదేవా! ఈశ్వరా! (37). దేవశ్రేష్ఠా! దేవతలకు ఎప్పుడెప్పుడు దుఃఖము కలిగిననూ, అప్పుడప్పుడు నీవునిశ్చయముగా ప్రకటమై దుఃఖమును నశింపజేయుము (38).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్తో భగవాన్రుద్రో బ్రహ్మణా హరిణామరైః | యుగపత్ప్రాహ తుష్టాత్మా తథేత్యస్తు నిరంతరమ్ || 39

స్తవైరేతైశ్చ తుష్టో%స్మి దాస్యామి సర్వదా ధ్రువమ్ | యదభీష్టితమం లోకే పఠతాం శృణ్వతాం సురాః || 40

ఇత్యుక్త్వా శంకరః ప్రీతో దేవదుఃఖహరస్సదా | సర్వదేవప్రియం యద్వై తత్సర్వం చ ప్రదత్తవాన్ || 41

ఇతి శ్రీ శివమహాపురాణ   రుద్రసంహితాయా యుద్ధఖండే దేవస్తుతి వర్ణనం నామ ఏకాదశో%ధ్యాయః (11).

సనత్కుమారుడిట్లు పలికెను -

బ్రహ్మ, విష్ణువు మరియు దేవతలు ఒక్కుమ్మడిగా ఇట్లు పలుకగా, రుద్రభగవానుడు సంతసించిన అంతఃకరణము గలవాడై అనేక పర్యాయములు 'తథాస్తు' అని పలికెను (39). మీ ఈ స్తోత్రములచే సంతసించితిని. వీటిని పఠించు వారలకు, విను వారలకు సర్వకాలములయందు అభీష్టతమములైన సర్వసంపదలను నిశ్చయముగా నీయగలను. ఓ దేవతలార! తెలియుడు (40). సర్వదా దేవతల దుఃఖములను పోగొట్టు శంకరుడు సంతసిల్లి ఇట్లు పలికి,దేవతలందరికీ అభీష్టమైన కోర్కెలనన్నిటీని ఇచ్చెను (41).

శ్రీ శివ మహాపురానములో రుద్రసంహితయందు యుద్ధఖండలో దేవస్తుతి యను పదునొకండవ అధ్యాయము ముగిసినది (11).